# పురుషార్థములు

తాళ్ళూరి నారాయణరావు గారు

శరీరధారియగు ప్రతిమనుజుండు దన యందు శారీరధర్మంబులు గొన్నియు నాత్మసంబంధమగు లక్షణంబులు గొన్నియుఁ గలవని విశ్వసించుచున్నాడు. శరీరమును ధరించి వ్యవహరించువ దాత్మయనియు శరీర మాత్మకుఁ గార్యాచరణము నందొక పనిముట్టువలె నుపకరించుచున్నదనియు భావించుచున్నాఁడు. శరీరము జడమనియు నస్థిరమనియు, నాత్మసంయోగరహితమైనచో నే కార్యమును నిర్వహింపఁ జాలదనియుఁ బ్రపంచానుభవంబుగల యెల్లరకుఁ దెల్లంబె. నిర్గుణుండును, నిర్వికారుండును, నిరంజనుండును నవ్యయుండునునగు నాత్మస్వరూపుఁడు నిజ మాయాసంజనితంబులగు, స్థూలసూక్ష్మ, కారణంబులను శరీర త్రయంబులఁ జిక్కి, వికారసహితుఁడై సగుణుండై, సర్వజ్ఞత్వాది లక్షణంబులఁ గోల్పడి, ధనేషణ, పుత్రేషణ, దారేషణ యను నీషణత్రయంబులకు వశుఁడై, నిజస్వరూపంబును మఱచి, శరీరమే తానను భ్రాంతి దగిలి, యింద్రియ కింకరుండై, పుడమి జరించుచున్నాఁడు. ఐహిక జీవితంబునందాతఁ డొనర్చు పుణ్యపాప ఫలంబులనుభవింపఁ జన్మపరంపరలఁ దగిలి, సుఖదుఃఖముల ననుభవించుచు, మరణవేదనలఁ బొందుచు, వివిధగర్భంబులఁ బరిభ్రమించుచున్నాఁడు. మాయాపరివృతుండై, నిజస్వరూపంబును మఱచి, యైహికవిషయ వాంఛాపరత్వంబునఁ గామ్యకర్మలొనర్చుచు వాని ఫలితంబు లనుభవింప జన్మపరంపరల మునిఁగి వేసరిలుచుఁ దరుణోపాయంబుఁ గానక పరితపించు జీవునకు స్వస్వరూప సాక్షాత్కారంబు గల్గింప, నీ పురుషార్థము లుపకరించుచున్నవి.

పురుషునిచేఁ గోరఁబడునవియే పురుషార్థంబులు. రూపనామక్రియారహితుండగు నాత్మస్వరూపుఁడు, దన యఖండత్వాది గుణగణంబులఁ గోల్పడి. నిజమాయ శరీరత్రయంబులఁ దాల్చి, యింద్రియ కింకరుఁడై పుడమిఁ జరించుచు జీవుఁడను పేర వ్యవహరింపఁ బడుచున్నాఁడు. అట్టి జీవుండే పురుష నామంబునఁ బిలువఁ బడుచున్నాఁడు. కావున జీవుఁడర్థించునవియే పురుషార్థంబులు. ఈ జీవుఁ డర్థించు కోర్కెలు, శారీరకములు, మానసికములు ఆధ్యాత్మికములని త్రివిధములు. కర్మక్షేత్రమగు నీభూమండలమున జనించిన ప్రతిమనుజుండును, దొలుత శరీర పోషణకై కృషిసలుపవలసి యున్నాఁడు. పురుషుఁడొనర్చు కార్యములన్నియుఁ దొలుత మనమునందు సంకల్పరూపముగ నుండి, క్రమక్రమముగ శరీర సంబంధమగు కార్యరూపముగఁ బరిణమించుచున్నవి. కావున శరీర మొనర్చు కర్మలన్నియు సక్రమరీతి జరుపఁ బడవలయునన్న, శరీరమును నడపించు మనసుకూడఁ గ్రమమార్గంబున దినదినాభివృద్ధిఁ గాంచవలయును. మానసికముగ నెంతయభివృద్ధిఁ గాంచినను, కర్మాచ

రణమున కుపకరించు శరీర మెంత సౌష్ఠవం బుగ నుండినను, మనుజుని మేధాశక్తి యెంత గొప్పదిగనున్నను, మెకా మెకప్పు డతఁడొనర్చు కార్యంబులు నిష్ఫలంబులగు చున్నవి. ఎంతటి శక్తి సంపన్నుఁడైనను నతఁడు సర్వజ్ఞుండు కాఁడు. పురుషుఁడీ లోకమునఁ బురుష ప్రయత్నమంతయు నొనర్చి, కార్యాచరణమునందు విఫల మనోరథుండైన, విసిగి వేసటఁ జెంది, విరాగియై తన యల్పజ్ఞత్వాదిగుణ గుణంబులఁ గుర్తెరుగుచున్నాఁడు. అప్పు డాతఁడు దన ప్రస్తుత స్థితి కంటె నున్నతస్థితి యొండుగలదనియుఁ దాని నెవ్విధినైన దాఁ బొందవలయుననియు భావించి కృషిసలుపఁ గడంగుచున్నాఁడు. పురుషుఁడొనర్చు నిట్టి కృషియే యాధ్యాత్మిక కృషియను పేరఁ బిలువఁ బడుచున్నది. త్రివిధములుగ నుండు నీకోరికలే పురుషార్థములు.

అనుభవజ్ఞులును మహనీయులును నగు ఋషిపుంగవులీ త్రివిధంబులగు పురుష వాంఛితంబులను ధర్మార్థకామ మోక్షంబులని చతుర్విధంబులుగ విభజించి యుండిరి. ఏయది స్థూలసూక్ష్మరూపముగ నుండు నీసృష్టికంతయు నాధారంబై యుండి, విచ్ఛిన్నముగాకుండ నిలిపి పోషించి, ధరించుచున్నదో యదియే ధర్మంబు. సృష్టిస్థితిలయంబుల కీధర్మంబె మూలము. ధర్మమనగా ధరించునదని భావము. శారీర, మానసికాభి వృద్ధికై చేయఁబడు వస్తుసంపాదనమే యర్థము. కామ మనగాఁ గోరిక. మాయాపరివృతుండగు జీవుండజ్ఞుండై, శరీర బంధనంబునఁ జిక్కి, స్వాతంత్ర్యము గోల్పడి, విషయ వాసనాపరుండై, నిజస్వరూప విజ్ఞాన రహితుండై, సుఖదుఃఖము లనుభవించుచు, జన్మ పరంపరలఁ దిరుగాడుచు, వేసరిలి, యైహిక విషయంబులరోసి, యింద్రియ వాంఛాపరుండుగాక విరాగియై, చిత్త సంస్కారంబును బొంది, యాధ్యాత్మికచింతఁదగిలి, స్వయంకృషనుపాయంబునను, జగదీశ్వరోపాసనా ప్రభావంబునను. శివగుణత్రయంబులజయించి, నిర్వికల్పుండై, సమాధినిష్ఠుండై స్వస్వరూప సాక్షాత్కారంబగు బ్రహ్మానందం బనుభవించుటయే, మోక్షంబను పేరఁ బరగుచున్నది, కర్మక్షేత్రంబగు నీభూమండలమున జనియించిన ప్రతి జీవుండును దనవైహికజీవితము సార్థకముగఁ బరణమించ వలయునని, మోక్షమును సంపాదింపఁ బ్రయత్నింపవలయును పురుషుని యైహిక జీవితము ధర్మబద్ధమై యుండినగానిఁ సార్థకతఁ జెందదు. ధర్మమే తక్కిన మూడు పురుషార్థములకును మూలము. తక్కిన పురుషార్థ స్వరూపంబుల నిర్ణయించునది ధర్మంబె. ధర్మవిరుద్ధంబుగ నుండు పురుషుని జీవితము దుఃఖభాజనమై, నిష్ప్రయోజనంబై, యైహికాముష్మిక సుఖరహితంబై, కృశించి నశించును.

ధర్మము శాశ్వతంబు. పరిణామరహితంబు ఆదిమధ్యాంతరహితంబు. కావుననది సనాతనంబనివ్యవహరింపఁ బడుచున్నది. ఇట్టిసనాతనంబగు ధర్మంబునే తమ తమ యాదర్శంబుగ నిడుకొని, యార్యావర్తము నందలి తొల్లింటి ఋషిపుంగవు లందఱును నుపాసించుచు చుండెడివారు, సనాతన ధర్మంబె వారి మతము. ధర్మమునకు మించిన దైవము వారికిఁ గోచరించలేదు. వారి మతంబున నీశ్వరుఁడు ధర్మస్వరూపుఁడే. భరత ఖండంబునఁ జరించిన తొల్లింటి మునిపుంగవులందఱు సనాతన ధర్మము నుపాసించుటచే

తనే. భరత ఖండమునందలి మతము సనాతన ధర్మమను పేర వ్యవహరింపఁ బడుచున్నది. ఋషుల మతము క్రైస్తవ, బుద్ధ, మహమ్మదీయాది యన్యమతంబుల మాడ్కి ప్రత్యేక వ్యక్తులపై నిలచి యుండలేదు. వ్యక్తిబోధనలపై నాధారపడియుండు మతంబులు స్థిరతరంబుగ నీ భూలోకమున నుండఁ జాలవు. వానికి వృద్ధి క్షీణతలు గలవు. ఆ యా మతంబులు వానిఁ గనిపెట్టిన మహనీయుల నామంబుల చేతనే వ్యవహరింపఁబడుచున్నవి. భరత ఖండమునందలి మతమున కొక వ్యక్తితో సంబంధము లేదు. అయ్యది సమస్త వ్యక్తుల కాధారమై, సమస్తలోకంబుల నడపించుచు, మూలధర్మమును నాధారముగఁ గల్గియున్నది. కావుననే సనాతన ధర్మంబునకు వృద్ధి క్షీణతలు లేవు. ప్రత్యేక వ్యక్తులపై నాధారపడియుండి తాత్కాలికాభివృద్ధిఁ గాంచిన మతము లెన్నియో, యీ భరతఖండమునఁ బ్రవేశించి, సామదాన భేద దండోపాయంబుల సనాతన ధర్మంబును రూపుమాప యత్నించెను. కాని యవి యెల్లను శిలాసంఘర్షణంబునఁ దుత్తునియలగు గాజుముక్కలవలె విచ్ఛిన్నంబులై, నిజస్వరూపంబును గోల్పడుచుండ సనాతన ధర్మమొకే విధమున స్థిరతరంబుగ నిలచి యున్నది.

ఈ ధర్మమే సృష్టియందలి ప్రతిపదార్థమును, శక్తిని శాసించి, నియమబద్ధముగఁ జేసి సృష్టివిధానంబును సక్రమ మార్గంబున నడపుచున్నది. సృష్టికర్తయను పేరఁ బిలువఁబడు నా విధాతకూడ ధర్మబద్ధుఁడె. ధర్మబద్ధుండగు విధాతచే విధింపఁబడిన శాసనంబులె సృష్టియందలి వివిధవస్తు స్వభావ లక్షణంబులుగ నేర్పడుచున్నవి. నానావిధవస్తు స్వభావ లక్షణంబు లా విధాత యాజ్ఞననుసరించియే క్రమక్రమంబుగఁ బరిణామ భేదమును జెందుచున్నవి. సృష్టిస్వభావము. చరాచర పదార్థంబు లన్నియు నియమ బద్ధములై కాలము గడచిన కొలదియు తరులతాదులు కాలమునందలి మార్పులఁబట్టి చిగిర్చి పుష్పించి ఫల ప్రదంబులగుచున్నవి. నియమబద్ధంబులై చంద్ర సూర్యతారకాగణంబులు దివారాత్రములఁ గలుఁగఁజేసి లోకమును బ్రకాశింపఁజేయుచున్నవి. ఋతువులయందలి మార్పుల ననుసరించి, భూమ్యుపరిభాగంబున నుండు జలాశయంబులలోని నీరావిరి రూపంబుగమారిన భోభాగంబున కెగసి, నీరదరూపమును దాల్చి, శీతలవాయు సంస్పర్శనంబున వర్షరూపమున మరలఁ బుడమి కవతరించుచున్నది. నిర్మలంబై, మాధుర్య సహితంబై పశుపక్ష్యాది జంతుకోటికిని, భూరుహ సంచయంబునకును నుపకరించుచున్నది. నియమబద్ధంబులై జరించు శుకపిక శారికాది శకుంత సంతానమద్వితీయుండగు వసంతాగమన ప్రభావంబున నుత్సాహపూరితంబై కడుపారమేసి మదించి, లోకుల కానంద మొదవఁజేయఁ గడుంగడు శ్రావ్యంబుగ మధురరుతం బొనర్చుచున్నది. లోకంబులెల్లఁ ద్రుటిలో ముంచివేయు సామర్థ్యంబున నొప్పారు భీకర స్వరూపుండగు సముద్రుండు నియమబద్ధుండగుటచేతనే చెలియలి కట్ట నతిక్రమింపకున్నాఁడు. కాఁబట్టి యీ ప్రాపంచిక వ్యవహారములన్నియు నొండొంటితో సంబంధము గల్గియుండి, జ్ఞాన స్వరూపుండగు నొక మహత్తరశక్తి సంపన్నునిచే నడుపఁ బడుచున్న

వనియును, నిరాధారములై నియమ రహితములై, కార్యకారణ సంబంధ శూన్యములై తమంతట తాము గల్గి యంతరించుచుండ లేదనియును స్పష్టపడుచున్నది.

కర్షకుని ప్రయత్నంబున దరుబీజంబునందమరియుండు శక్తులన్నియు దినక్రమంబునఁ బరిణామ భేదంబు జెంది చెంది తుదకు శాఖాఫల పుష్పకిసలయ సమన్వితంబగు తరురాజంబుగ నలరారుచున్నవి. వటబీజమునందలి మహత్తర శక్తులబోలె, పుడమి జనించిన ప్రతి జంతువును సహజములగు కొన్ని శక్తులను గలిగియున్నది. ఆయా శక్తులును, గుణంబును, దొలుత సూక్ష్మరూపంబున నంతర్గర్భితంబులై యుండుటచే బాహాటంబుగ నెల్లరకుఁ దెలియరావు. కాని కాలముగడచినకొలదియు జంతువులు శారీరకాభివృద్ధిఁ గాంచుచుండును వానియందుండు సహజగుణంబులును శక్తులును వయసుతోఁబాటు క్రమక్రమంబుగ వికసించి స్థూలరూపమును దాల్చును. అప్పుడవి యెల్లరకును గోచరంబగును మనుజుండును జంతుకోటిలోని వాఁడేయగుటఁ గాలక్రమంబున నట్టి మార్పునే చెందుచున్నాఁడు. పశుపక్ష్యాది జంతుకోటియందు గానఁబడు పరిణామ భేదంబునకును, జంతుకోటి కంతకును శిరోభూషణంబుగఁ బరిగణింపఁబడుచుండు మనుజునియందుఁ గానఁబడు పరిణామ భేదంబునకును విశేష తారతమ్యముండును. ఆహార విహార నిద్రాశయ్యాసన భోగంబులెల్ల జంతువులకును సామాన్యధర్మంబులు కొట్టెదనన్న వెఱపును బెట్టెదనన్న నాసయు నెల్లజంతువులయందుఁ గానఁబడును. స్థూల శరీర వాంఛితంబులన్నియుఁ బశుధర్మంబులగుటచే నెల్ల జంతువులకు సామాన్య లక్షణంబులై యున్నవి. క్రిమికీటకాది నానావిధ జంతుసంతానమేవిధంబుగ నాహార పానీయాదులందపేక్ష నిల్పి వానిఁ బొందఁ గృషి సలుపుచున్నవో, నరుండును నదేవిధంబుగ వానిఁబొందఁ గృషిసలుపుచున్నాఁడు. తమను, దమకుటుంబమును నాప్తకోటిని బోషించుకొనఁ జేయఁబడు ప్రయత్నంబులెల్ల జంతువులయందును గానఁబడును.

పశు పక్ష్యాది జంతుకోటికుండు లక్షణంబులకంటెఁ బురుషునందుఁ గొన్ని విశేష లక్షణంబులు బొడసూపుచున్నవి. పశువులును, పక్షులును, క్రిమికీటకాదులును, స్వాతంత్ర్యమును గలిగియుండక, జగదీశ్వర దత్తంబులగు సహజగుణగణ ప్రేరితంబులై పుడమి జరించుచున్నవి. వానివాని క్షుత్పిపాసాదులఁ దత్తత్కాలానుగుణంబులగు నుద్రేకంబులఁజెంది, నియమబద్ధములై పొందఁ గల్గుచున్నవి. పూర్వాపర సందర్భముల విచారించి, తమ క్షేమమునకనువగు విధంబున, దమ కార్యవిధానంబును వర్తనంబును జక్కఁజేసుకొను సామర్థ్యంబు వానియందుఁ గనఁబట్టదు. వానివానిఁ గాపాడు భారము సృష్టికర్తయగు విధాతయే వహించుచున్నాఁడు. కాని జంతువులయందుత్తముండగు నరునందా సామర్థ్యంబు మిక్కుటంబుగఁ గనఁబడుచున్నది. అతఁడు దన ప్రస్తుతస్థితిగతులఁ బట్టి భావపరిణామ మెట్లుండునో యూహించకొనఁగలఁడు. తనజననమాదిగాఁ దనయందుఁ గల్గుచుండు మార్పు లెఱుఁగఁగలఁడు. కామార్థసిద్ధిఁబొందఁ దనవర్తనమును వలయుచో మార్చుకొనఁగలఁడు. యుక్తా

యుక్తునులరయఁగలఁడు. కావున, పశు పక్ష్యాది జంతుకోటి యందుఁ గానరాని మహాత్తర లక్షణంబొండు పురుషునియందుం డ వలయునని విశదమగుచున్నది.

అయ్యది జ్ఞానంబె. జ్ఞానరహితుండగు మనుజుఁడు పశుతుల్యుండు. జ్ఞానరహితంబులై పుడమి జరించు పశుపక్ష్యాదులు, దమతము రక్షణకా సృష్టికర్తయగు పరమేష్ఠి నేనమ్మి, సహజగుణ ప్రేరితంబులై సృష్టిధర్మము ల ననుసరించవలసి యున్నది. జ్ఞానాధిక్యం బునఁ బ్రకాసించు మనుజుండట్లుగాక నిధా తచేఁ గొంతవఱకు స్వాతంత్ర్యముగూడఁ బ్రసాదింపఁబడి యున్నాఁడు. ఇట్టిస్వాతం త్ర్యముండుటచేతనే మనుజుఁడు దనపరిస్థిత పరిస్థితులఁబట్టి తనభావి పరిణామ మెట్లు లుండునో యూహించి యనుసరమగుచో దనకార్యవిధానంబును వర్తనంబును సూర్చు కొనఁగలుఁగుచున్నాఁడు. తనయొక్కయుఁ దన యాప్తులయొక్కయు శ్రేయస్సునుఁ గోరి నిరంతరకృషి సలుపఁగల్గుచున్నాఁడు. పురుషుఁడిట్లొనర్పఁ గల్గుటకు జగదీశ్వర దత్తంబగు జ్ఞానంబె కారణంబు. తక్కిన జంతు సంతానమునకంటెఁ బరమేశ్వర ప్రసాదితంబగు జ్ఞానంబతిశయంబుగఁ గల్గి యుండుటచేఁ బురుషుఁడీ పుడమి నొనర్చ వలసిన కర్తవ్యంబును కార్యభారంబును మిక్కుటంబగుచున్నది.

ఈశ్వర దత్తంబులగు జ్ఞానంబును, స్వాతంత్ర్యంబును, బురుషున కుపకార దాయకంబులుగఁగాని యపకారదాయకం బులుగఁగాని పరిణమించవచ్చును. దృష్టి యందే పదార్థమును కేవలశుభ ప్రదంబుగ నుండఁజాలదు. అట్లనే యేపదార్థమును కేవలమశుభ ప్రదంబుగ నుండఁజాలదు ప్రతిపదార్థంబునందును శుభాశుభ లక్షణం బులుగలవు. ఆయావస్తువుల ననుపయో గించు విధానముపై నాయావస్తువులిచ్చు ఫల స్వభావంబు నిలిచియున్నది. ఖడ్గముసత్పురు షుని చేతి నలంకరించిన దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబును నొనర్చి లోకోపకారసంధా యకంబగుచున్నది. దుర్మార్గవర్తనుని చేతి సూతి సజ్జనుల నేధించి లోకకంటకంబగు చున్నది. కాంతివంతముగఁ బ్రకాశించు జ్యోతి యంధకారమును బాపి, వలయునుష్ణత నిచ్చి లోకోపకారియగుచున్నది. అదియే కరస్పర్శమొనర్చిన గరంబునుఁగాల్చి పీడా కరంబై వేధించుచున్నది. అటులనే మధు రంబుగనుండు శర్కరకొలఁదిగ గుడిచిన, రుచికరమై యారోగ్యదాయకంబుగనుండి శరీర పుష్టికినుపకరించుచున్నది, అదియేయమిత ముగ సేవించిన రోగకారణమై, విషతుల్య మై, వేదనాకరమగుచున్నది. మంచిచెడుగుల వచ్చునస్వభావము ప్రతివస్తువునందునుగలదు. అందుచే నావస్తువునస్సలు కళంకమును నా పాదించరాదు. పురుషుఁ డేవస్తువునైనను దనమంచికొఱకుపయోగించుకొనవచ్చును. లేదా దానిని దనచెఱుపున కుపయోగించు కొనవచ్చును. దానిని సక్రమరీతి నుపయో గించుకొను భారము పురుషునిదే. కావున మనుజుఁడు దనకాపరమేశ్వరునిచేఁ బ్రసా దింపఁబడిన జ్ఞానంబును, స్వాతంత్ర్యంబును దనమంచికిఁగాని, చెడుగునకుఁగాని యుప యోగించుకొనవచ్చును. వానినిసద్వినియో గి మొనర్చిన నరుఁడు శారీరమానసికాధ్యా త్మికాభివృద్ధిఁగాంచి తన జీవితకాలమును సఫలపఱచుకొనును. దుర్వినియోగ మొన

స్పనవతడు పశుతుల్యుండై, కామాంధుం
డై, విచక్షణా రహితుండై, పుడమిఁ జరించి,
శారీర మానసిక దౌర్బల్యంబును జెంది,
పతితుడై క్రమక్రమంబుగ క్షీణగతికి వచ్చు
చున్నాడు.

జీవులకు దరుణోపాయంబగు నిష్కా
మ్య కర్మంబొనర్ప నీభూలోకంబె తగిన
స్థలంబు. కావున గర్మక్షేత్రంబగు నీభూ
మండలంబున కవతరించిన ప్రతిజీవుండును,
తనకర్తవ్యంబును గార్యభారంబును సక్ర
మంబుగ గ్రహించి, యాత్మాభివృద్ధినిఁగోరి,
సత్కర్మాచరణం బొనర్చుచు, జీవయాత్రఁ
గడపుటయే ప్రధమకర్తవ్యంబు. జ్ఞానంబును
స్వాతంత్ర్యంబునుఁ బ్రసాదింపఁ బడినవాఁడు
దనమంచిచెడుగులకుఁ దానే కారకుఁడగు
చున్నాఁడు. స్వాతంత్ర్యముగాని, జ్ఞానము
గాని లేని పశుపక్ష్యాది జంతువులు సృష్టి
ధర్మముల నతిక్రమింపకుండ జీవయాత్రఁ
గడుపఁగల్గుచున్నవి. కాని స్వతంత్రుఁడగు
మనుజుండో కానొకప్పుడు దన యవివేకము
చే సృష్టిధర్మములగూడ నతిక్రమించి, బుడ
మిఁజరించుచుఁ గాలక్రమంబునఁ దనసహజ
లక్షణంబులఁ గొన్నిటిఁగోల్పడి, విఫలమనో
రథుండై, పశుపక్ష్యాది జంతుసంతానము
కంటెనధమాధముఁడగుచున్నాఁడు. జ్ఞానం
బును సక్రమరీతి నుపయోగింపక, సృష్టి
నియమిత ధర్మముల నతిక్రమించి సత్తువ్యస
నంబులఁదగుల్కొని, క్షీణదశకువచ్చుచుండు
వ్యక్తులను మనమెందఱినిఁజూచుచుండలేదు.
వారిశరీరములును, మనములును దుర్బ
లములై యవివేకోనర్పవలసిన సామా
న్యకార్యములకూడ నిర్వర్తింపఁ జాలకుండుట
మన మనుదినమును గాంచుచుండలేదా?

కావునఁ బ్రతిమానవుఁడును, నాత్మాభివృ
ద్ధినిఁగోరి, జాగరూకతగలవాఁడై జీవయాత్ర
గడపుచు సక్రమమార్గంబున, స్వశరీరాభి
వృద్ధికిని, మానసికాభివృద్ధికిని, నాధ్యాత్మి
కాభివృద్ధికినిఁ గృషిసలుపఁగడంగవలయును.

ఆత్మాభివృద్ధికైఁ గృషిసలుపుట సుక
రముగాదు. స్వకీయాభివృద్ధికై కృషిసలు
పు నపుడనేక జన్మపరంపరలచేఁ గల్గుచు
వచ్చిన పలువిధంబులగు వాసనలు పెక్కు
యాటంకములఁ గలుగఁ జేయుచుండును.
ఈవాసనలను నందుమూలముగఁ గల్గు
నాటంకములను బురుషుఁడు స్వయంకృషి
బలంబునను, బరాత్పరో పాసనాప్రభావ
మునను, నతిక్రమించి యాత్మాభివృద్ధిఁబొంద
గల్గుచున్నాఁడు. పురుషుఁడు బద్ధకంకణుఁడై
యాత్మాభివృద్ధికిఁ గృషిసలుపుచుండు సమ
యమున నాతని కాటంకములఁ గలుగఁ
జేయు వాసనాపరంపరల జయించునట్టివ
ర్పుటకే. జితేంద్రియులును, నీశ్వరధ్యాన
తత్పరులును, ననుభవజ్ఞులును, బరోపకార
సంధాయకులును నగు ఋషిపుంగవు లనేక
ములగు ధర్మశాస్త్రములు రచించియున్నా
రు. ఆత్మాభివృద్ధికై కృషిసలుపునపుడు
తొలుత వారును మనవలెనే పలువిధంబులగు
నాటంకముల ననుభవింపవలసి వచ్చెను.
శాస్త్రచోదిత విధంబున మెలఁగి, నియమిత
వర్తనులై, స్వయంకృషిచేతను, నీశ్వరాను
గ్రహముచేతను, వానినుండి తప్పించుకొని,
విమలజ్ఞాన సంపన్నులై, త్రికాలవేదులై,
లోకులనుద్ధరింపఁ దమతమ యనుభవంబులఁ
బట్టి వివిధశాస్త్రంబుల లిఖించియున్నారు.
ఋషిపుంగవు లెల్లరు సృష్టిస్థితిలయంబుల
కాధారమగు నా సనాతనధర్మస్వరూపుని కే

యుపాసించుచుండిరి. ప్రతిమునీంద్రుడును తన స్వానుభవంబును బట్టి యా సనాతనధర్మ స్వరూపంబును దాని నుపాసించు విధానంబును నభివర్ణించియున్నాఁడు. అందువలననే మన దేశమున బాహ్యమునకు వేఱువేఱుగఁ దోఁచు మతము లనేకములుగాన వచ్చుచున్నవి. కాని వాని నిజస్వరూపం బెఱుంగఁగోరి, నిష్కల్మష హృదయముతో విమర్శించిన వానికన్నిటికిని నాధారంబులగు ప్రధానమూల సూత్రంబులన్నియు నొక్కవిధంబుగనుండి, సనాతన ధర్మస్వరూపం బెఱుంగ నవియన్నియు లోకులకుఁ దోడ్పడుచున్నవని మనము గ్రహింపఁగలుగుచున్నారము. ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది సిద్ధాంతములును, బాహ్యంబునకు చిన్న చిన్న రూపంబులతోఁ గాన్పించుచుండినను, ప్రధాన సూత్రములం దిసుమంతయు భేదము లేక, పురుషుని మానసికాధ్యాత్మిక శక్తుల వికసింపఁజేసి, విశ్వరూపుండగు నా సనాతన పురుషుని నెఱుంగుటకే తోడ్పడుచున్నది.

ప్రతిమనుజునియందును బుట్టుకచేఁ గొన్ని గుణంబులును, శక్తులును నంతర్గర్భితంబులై యున్నవనియును, వానిని క్రమక్రమంబుగ వికసింపఁజేయుటయే, యైహిక జీవితోద్దేశ్యమనియును మనమిదివఱలోఁ గమనించి యున్నారము. సహజంబులును పురుషుని యందిమిడియుండినవియునగు గుణగణంబుల వికసింపఁజేయుటయే యభివృద్ధియనుపేరున వ్యవహరింపఁబడుచున్నది. ప్రపంచమునందలి విద్యలన్నియు నిందులకే యుద్దేశింపఁబడినవి. అందులకే యుపకరించుచున్నవి. ఐహికవిద్యలన్నియును శరీరపోషణంబునకును, నింద్రియసౌఖ్యంబులఁ దనపఁ జెందుటకును నందులకువలయు పదార్థసంపాదనమునకును, ధనార్జనంబునకును నుపకరించుచున్నవి. అట్టివిద్యలే లోకులమనంబుల మిక్కుటంబుగ నాకర్షించి, శారీరకాంక్షితంబుల దీర్చుకొనుటకు వలయు వస్తుసంపాదనా సామర్థ్యంబును బ్రసాదించుచున్నవి. శరీరపటుత్వ ముండునంతవరకును నింద్రియవాంఛలఁ దృప్తిపఱుపఁగల వస్తుసంచయము సమకూడుచుండు నంతవరకును బురుషుని మనమాధ్యాత్మికవిద్యకై మరలదు. ఇంద్రియలోలుండై చరించు మనుజున కాధ్యాత్మికవిద్య నభ్యసించుట గడుంగడు కష్టసాధ్యము. ఆధ్యాత్మికవిద్య యింద్రియలోలత్వంబును నిరసించెను. ఇంద్రియకింకరుండై చరించి కలుషితవాసనలచేఁ బీడింపఁబడు మనుజుండు తనమనంబును సులభంబుగ నాధ్యాత్మిక విషయంబులకు మరల్పఁజాలఁడు. కాని పురుషుని యభివృద్ధి కైహిక విద్య లెట్లగత్యములో యాధ్యాత్మిక విద్యలును నట్లే యత్యవసరములై యున్నవి. ఏలయనఁ బురుషునియభివృద్ధి సర్వతోముఖమై యుండవలయును. కాని పాక్షికముగ నుండరాదు. అభివృద్ధి పాక్షికముగ నుండిన నది పురుషునిజీవితమును సార్థకమొనర్పదు. కేవల శారీరాభివృద్ధి గాని, కేవల మానసికాభివృద్ధి గాని, కేవలాధ్యాత్మికాభివృద్ధి గాని, పురుషున కుపకారదాయకముగాదు.

పురుషుని యైహికాధ్యాత్మిక జీవితంబుల కుపకరించు విద్యలును, తజ్జనితంబులగు నభివృద్ధులును, నతఁడు స్వేచ్ఛాపూరితుండైయున్న లభింపఁజాలవు. సక్రమముగ నభివృద్ధిఁ గాంచవలయు ననిన పురుషుని స్వాతంత్ర్యము గొంతవఱకు గల్పింపఁబడవల

పుష్పమాల.



Lakshmi Art Bombay, 8.



# పూజాప్రబంధము



( మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు )

---

ఉ॥ శ్రీయురమందునన్ సుమధరిత్రి దయారసమందు నీళయున్
జేయు సపర్య దోహదతఁ జెంది తడెంది యొనర్పఁజాలు లే
కీయుర మీశుమాగుణము నీదయయు న్వెడఁగూట తొట్టులం
జేయ కలంకు శేషశిఖరీశ్వరు నెంతుగొ వానిగొల్చెదన్॥

ఉ॥ శ్రీయెద భూమినీళలిరుజెంపల గేల్లవ శంఖచక్రముల్
బాయక వెల్గభక్తుల కపాయము బాపెడు హస్తముద్రతో
గాయజుఁగన్న పోయగపు కాయముతో బాడనూపి వేడ్కనే
సేయు సపర్యఁజెంద దయసేయగదే వృషశైలనాయకా॥

చ॥ బలిశిరమెక్కె నెయ్యది నభస్స్థలి కేగిన దెద్దియీ మహా
స్థలివడిఁగొల్చె నెయ్యది పదత్రితయంబది కాంచి వేడ్కతా
మ్ములనుచు గ్రమ్మ తుమ్మెదల ముమ్మరిమాన్పగ జాలచంపక
మ్ముల నొలపొస్ప పీఠికఁ దిమోడ్చెదఁ గేలుపకంబులుంచవే॥

ఉ॥ తీరని ప్రేమ సూరులనుతించిన సాలెనమంత్రమూర్తులం
జేరి సమష్టినీదగు విశిష్ట శుభాశ్రయమందమంగి యు
న్నారిది సేనెఱుంగుదు ననాదిభవాంబుధి నీదులాడి వే
సారితి జాలు నీదుపద సారసము ల్భజియింతు నిల్వవే॥

ఉ॥ గంటగణాంగణ న్స్మరయ గావిరి భీకరి భూతజాతి వె
న్వెంటన దిక్కులంబడవ వేలకొలంది విమానపంక్తులన్
మింట సురాప్సరల్ నిలిచి మెల్లన బుష్పములఁజల్లఁ జొచ్చి డిం
డొంటిగ నిన్నువీడ మదినోర్వక వచ్చిరి సర్వపార్షదుల్॥

చ॥ పడగలువిప్పి ఛత్రముగబట్టె ననంతుఁడు వైనతేయుఁ డీ
యడుగుల వీపునందిడి రయంబున దెచ్చె గదాసిచక్రముల్
సడలని శ్రీమహాదులు సైన్యవిభుండును వెంటవచ్చి ర
క్కడ మణిమంటపంబునకు కావివరింక నెఱుంగ రాదుగా॥

ఉ॥ స్వాగతమే సరోరుహా కరావనిసీకెల తోడనీకు సు
స్వాగతమిందు దేవు లిపుచక్కని రొమ్మున వెల్గి నిల్వవా
స్వాగతమాయనంత వినతాత్మజ సాహస దూలారరంపు సు
స్వాగతమాసనంబులివి సన్మతినిల్వుడు పూజలిచ్చెదన్॥

ఉ॥ సుస్వరమొప్ప వేదములు సూరులు నల్గడలం బఠింప స
త్స్వరమూర్ఛన్ నాగతుల తాళలయశ్రుతిమేళ నాస్తిను
ద్విస్స్వన యుక్తితూర్యములు సందడి మ్రోయగ నేను సేయు స
ర్వస్వ సరస్వతీ ప్రియ సపర్యను గైకొనవయ్య వేదాదన్॥

ఉ॥ బ గరుబట్టలు న్సుపుపట్టిన గన్నడదంపుగట్టితో
ముంగితమే శీఘ్రముగను సమీనతయూచ భవద్విశాంగనా
లింగనసంగ దూషితము లెమ్మిక బొంకులవేల బైసిదీ
యంగలడంచు సుగ్గుకు భయంపడియైనను బీరనిల్వమా॥

ఉ॥ రంగగు గాంగపద్మ మకరందమున స్ఫురదంఘ్రి నుండి
రంగనజుండు భక్తి దనరంగగ నుండలు వొగ్గిపట్టె సా
రంగధరుండు నిమ్నకుహార స్ఫురదగ్రకరదన్ వాసిగా
రంగముబట్టె వేధకుధరాముని పాదక్రమునంగు నర్యోదన్॥

చ॥ గొడుగుపలాశదండమును గోచియు జాత్రియుగూడ కట్టు గు
జోడలు మృగాజినంబు శిఖలొప్పగ మాంజిమొలం జెలంగదుం
డుడుకుతనంబు నన్నడయు దొంత్రపడన్నడి యజ్ఞవాటిరా
నడరిననిన్ను గాంచి వటుడంచు జలిందాత్రిడు మోసపోయెగా

క॥ వడుగువయివచ్చి బలిఁగని కడుసొగసున నతని మనసు గరగించి యుతం
డడుగుమనిన నడిగినది మూడడుగుల ధరయాక్రమించినది ముజ్జగముల్

కం॥ బలితలను పదజలజమిడి యలయతలంబతనికిచ్చి తటమున్నిపుడీ
బలితలను పదజలజమిడి యలయతలంబిమ్ము వామనాంగుడ విభుడా॥

చ॥ తరళ విభాతరంగముల దత్తరమొందెడు జూడుమయ్య నీ
చరణములెందొ బాడలఁచె సాగగనీకటు సేయవేని నా
పరుసపునోరు దూరెడక పాయదపాయము సుమ్ము నమ్ముమీ
తిరిగెడుకాలు దాదిరుగఁ దిట్టెడు నోరెటులూరకుండెడిన్

చ॥ జలియుడు చాపధారమును బట్టిన కేలలకాళి యస్ఫుటా
వళిని నటించుచో నొడిసి వాలము బట్టిన కేలు నంతిమాం
గుళినలవమ్ వారణకు గొండను నిల్పిన కేలు సర్కజా
జలములవేత్రిత చుగ్గవలఁ జల్లిన కేలికి హర్ఘ్యమిచ్చెదన్॥

ఉ॥ పంటులనున్న వెన్న వెగఁ బ్రాకిదివంగని నక్కన గొల్లవా
లంటులు వెంటబెట్టఁ జెలికాండ్రను నీవును వేగరి బాలతోరి
సంటకెయొందొ డాగి పయినంటిన వెన్నను వాకిలొన్న నీ
తుంటతనైచెడి తెల్లముగ దోడను కేల్గవనుంచు మిచ్చెదన్

ఉ॥ ఆచమనమ్ముగొమ్ము నిఖిలామరవందిత పాదపద్మనీ
లాచలసింహభూధర వనాచల విష్ణురథాచలాదినా
నాచలకేళి కౌతుకములన్నియు నొక్కెడజూపగోరి శే
షాచలమందునన్వెలసినట్టి పరాత్మ దురాత్మ భంజనా

చ॥ రవిగలదీప్తి చంద్రురుని రమ్యతగ్రక్కల లెక్కలేమియుం
దివిగల మేరలేమి జలధింగల పూర్తియునీమహావిలో
లవములుగాగ యోగులు దలంతురగాధమనోజ్ఞనీవు క
ర్గనకిటు విందుసేయుటను గంటినదెల్లను నిక్కవంబుగన్॥

ఉ॥ కృష్ణుడవై జనించి పరికీర్ణ వనావళి వత్సధేను వ
ర్ధిష్ణుడవై చరించు శ్రీమతికి సుమీ జడియంగఁబోకు హా
తృష్ణనుగాచి పైపడి యదర్చితి నావిరివచ్చుగాని మం
దోష్ణములీ సరస్వతి శుభోదకముల్ కృపఁగొమ్ము పాద్యమున్॥

క॥ భృత్యుని లేమయు పుత్రిక లత్యామోదమున మజ్జనాదులు లక్ష్మీ
శ్రీశ్యామలకు నొనరించిరి సత్యలు సుస్నాతునిగా మదిలించిరి వేడ్కన్.

సీ॥ ఇదియలంకారము ధరింపనిడిన పీఠి యందు గూర్చుండి ధరియింపు మనిశ్వాసీయ
దివ్యభూషణ వితతులు జీవదేవ కౌండప్రులు మరిన్నిగాను మిసి తులసిసరులు ॥

క॥ చందనలేపనమును గ్రన్ధ జవాదియు వెన్నెలలతోడ సమ్మిళితంబై
యందమగు నీలమేఘము చందంబున నీదు మేను సంశోభించున్।

క॥ ఇరుగేలవల నిరుతేఖలు మెరయు బోమల నడుమ లలితమ్మృగమదతిలకో
పరి శ్రీచూర్ణము చెలగెను తిరుమణిఫాలమున దేవ దేవ ముడంగ దే॥

క॥ ఇరుగేలవల నీమోమున మెరయు బోసుల్ మధువు మిగుల మొనపియించునటున్
సందమ్మి సోలు తేటుల వరుసం దగున్ లేత తేటివల తిలకంబున్ ॥

క॥ మంగళకిరీట మణిమయాంగదమాణిక్య కుండలాదులు మెరయన్
బంగరు బట్ట ధరించితి వంగజునింగన్న తండ్రి వప్పెడు భళీ ॥

చ॥ తులసినవ స్రగ్వితతిముఖతోయదమాల్యములు గన్నెరుల్ గులా
బులు మరిమాలతీ కుసుమము - ల్విరి గొజ్జగిపూలు సంపెగల్
చెలగెడు బొండుమల్లెలును జేరిచి నానవనానస్రిమంత్రి స
మ్మిళితముగాగ నుత్సవసమేతముగా నిదె పూజసల్పెదన్ ॥

గీ॥ అష్టమూపంబు వినిహతారిష్టదయము దుష్టభూతపిశాచివినాశకరము
నష్టనిఖిలాఘవితతి సుపుష్టికరము శిష్టపాలకగొనుమయ్య శ్రీరమేశ ॥

ఉ॥ చొక్కపు టారతుల్ లోగము చుట్టును ద్రిప్పిన దృష్టిదోషముల్
గ్రక్కున దీరిపోవును నిగారపు బల్ జెమ్మటక్క గప్పురపు
సొక్కపు వెల్గు దీపికల మూలమునూత్తమముచ్చరించుచున్
జక్కగనిత్తు నారతులు సమ్మతిగైకొను మబ్జలోచనా ॥

క॥ బంగరుతమ్ములనాళములం గల తంతువుల పెనచి లలితగ్రంథాత్రి
సంగ మొనరించి పడిన రంగగు జన్నిదములివ్వి రహిగైకొనుమా ॥

(సశేషము.)

మఱికొందఱు:- ఈపైవారివాదనకు కేవలము సోమరితనమే కారణము, ప్రాచీన కవులు పాలించిన నియమముల గౌరవించి కవిత్వము వ్రాయుటకష్టతరమా?- అగునని తలంచువార లీదోషభూయిష్ఠమగు రచనను- కవిత్వమును- ఎరువుసొమ్ముల తెచ్చుకొని దెచ్చిపెట్టుకొని/ఎట్టులో వ్రాయకున్న జగము తలక్రిందగునా?- అనియందురు.

మొదటివారిలో నొకరు- మత్తేభమును వ్రాయుచు, మధ్యనొక శార్దూల పాదమును వ్రాసినా దొకక్రొత్త పద్ధతి యందురు. ఇంకొకరు గీతపద్యమును వ్రాయుచు నందులోని యింద్రగణములకు బ్రత్యామ్నాయంబుగ- మ, య, సగ, జ, గణములువేసి "నాదొక క్రొత్తపక్కి నేనీ నియమములకు దాస్యము చేయజాలను" అందురు. మఱియొకరు-అన్య భాషాపదంబులకు మనభాషలో సరియైన పదములులేవు కనుక నేనా భాషాపదంబులనే యుపయోగింతును ఇందుకు నేనే ఒకమార్గదర్శకుడనయ్యెదను. అందురు. కారణమడిగిన "The english is my medium of thinking" అందురు పైగా "Tere is an age coming" to appreciate our Poetry అని యనులాడుదురు. మొదటి పెద్దమనుష్యుని "పద్ధతి"కి కారణము శుద్ధమగు నశ్రద్ధయే.

రెండవ పెద్దమనుష్యుని "పక్కి"కి కారణము లక్షణజ్ఞాన శూన్యత్వమే.

ఇఁక మూడవ పెద్దమనుష్యుని దారి కేవలము గోదావరిలోనికే.

సపాటలను గురించి పయువాచ్యములగు నియమ భంగములఁగుఱించి మనవారు- అనగా నియమభంగవాదులు- "There is an age coming to appreciate our poetry" అనుచున్నారో అట్టివానికి మనపూర్వుల వాఙ్మయమున స్థానమీయక వదలివేయుటకును, నేడుమాత్రము బలమైన ప్రచారము కలుగుటకును బలమైన కారణము కలదా? పూర్వములేని ముద్రణాయంత్రములు నేడు విచ్చలవిడిగ ప్రబలుటచే నెవరైనను నచ్చువేయించుకొనుట కవకాశము కలుగుటయే యనుకారణమొక్కటియేనా?

ప్రోసి-యున్నింటిని మనము "ప్రోసిరాజ"సి క్రొత్తపద్ధతు లేర్పాటుచేసిన మన తరువాత వారుమాత్రము మనపద్ధతులను మన్నింతురా? వారుమఱల క్రొత్తనియమము లేర్పరింతురు. ఇట్లే ఎవరికివారిదైన రెండుమూడు శతాబ్దములలో భారతి కవిత్వము తెలుగుకాదనియు అయ్యది "ప్రాచీన"మనియు ననువు కొందరు ఇట్టి "ప్రాచీనముల"ను వారివారి క్రొత్తపద్ధతుల మార్పులనుబట్టి అర్థము చేసికొనుటకూడ దుర్ఘటముగనుండును. అప్పుడట్టి "ప్రాచీనముల" కేమిగతి పట్టునో యోజింపుడు. ఈ నియమోల్లంఘనమును- ఈఅన్యభాషా దాస్యమును, చేయకయే యుండవలెఁగాని చేసినచో అది- నొకరొకతోవ- యింకొకరొకత్రోవ- చెట్టునకొక పిట్టయై పోవుట తప్పక సంభవించును. అప్పుడు ఒకసంఘము ఒక భాష- ఒక కవిత్వము అన్న విషయములు పూర్తిగా విస్మరింపబడును.

ఇది రాఁబోవున్న ప్రళయము. యాదవ కులమునకు ముసలము పుట్టనుకొండు.

